# వ్యవహారబోధిని

మొదటి భాగము.

ఈగ్రంథమునందు, వర్తకపద్ధతులపత్రికాలేఖనము ఎలిమెంటరీ స్కూళ్లలోనుండు బాలురకును విశేషించి వ్యవహారశక్తిగల ప్రతిమనుష్యునకును మిక్కిలి యుపయోగించు వ్యావహారిక విషయములు న్యాయశాస్త్రసిద్ధతుల ననుసరించి విపులముగ వ్రాయబడి యున్నవి. వెల 0—5—0

## ఆరోగ్యబోధిని.

—:0:—

ఈపుస్తకమునందు వ్యాధులయొక్క కలుగుచున్న వైవానిని గురించియు, వ్యాధులు కలుగకుండ శరీరమునుకాపాడుకొనుటయెట్లో దానిని గురించియు, మొదలగు సంగతులను బోధించును. వెల 0—4—0

## స్త్రీమనోజ్ఞభాస్కరము.

అనేకములగు ఉత్తరములు నమూనాలును, వానిని వ్రాయవలసిన విధమును కలవు.

వెల 0—6—0

## తెనాలి రామలింగని వింతకథలు.

వెల 0—4—0

పైపుస్తకము కొనువారికి స్త్రీమనోజ్ఞభాస్కరము 0-5-0 లు మాత్రమే.

వలయువారు :— రామా అండ్ కో,

హెడ్డాఫీసు-ఏలూరు, కృష్ణాజిల్లా.

# ఉపోద్ఘాతము.



సుజనులారా!

ఎద్దేని చిన్న పుస్తకమొకటి వ్రాయఁదలఁచి తొలు బొల్తుదైన ప్రార్థనంబు సమ్మతమగుట శ్రీకృష్ణభగవానుని నిర్హేతుకజాయమాన కృపాకటాక్షమున నీస్తోత్రము రచించితిని. వెంటనె ముద్రింపించుటకు "శ్రేయాంసి బహువిఘ్నాని" యనున్యాయంబున లేమికిందోడుగ నస్మన్మాతాపితల వియోగములును నంతరాయకములయినవి. నాటుపోసిన నాఁడె నీరుపోయునను మాడ్కి శ్రీనారదసూక్తి యనుసారకృపంగాంచోలు - నిహేలాపుర వాస్తవ్యులును వైశ్యవరులును గుండేపల్లి విస్సన్నపేట మున్నగు నస్టేటుల జమీందారులునునగు మ॥రా॥శ్రీ మోతే వేంకన్న గారును నీరి సాదరులగు శ్రీ గంగరాజుగారును దమకు శ్రీ భగవంతునియందలి భక్తివెల్లడించుచు నాయెడఁగల ప్రీతిమెయి నాదరముగ నొక్కపద్యముకు నిది ద్రవ్యమొసఁగి యుప్రోత్సాహింపించి నందులకు నాదగు కృతజ్ఞత కొంతయుం బాత్రులు. మఱియు నప్పుడప్పుడు తీరికగా గ్రంథరచనకనువగు సదాశయము లొసంగుచునచ్చిన మన్మిత్రవరులగు బ్రహ్మశ్రీ చింతలపాటి పట్టాభిరామ శాస్త్రులవారికి కొంతయు నాదగు కృతజ్ఞతాపూర్వక వందనములర్పించుచుంటిని. ఇటీవల వైదర్భిపరిణయమను నాటకమును గూడ రచించితిని. అయ్యదియు నచ్చులోనున్నది. అయినను గ్రంథరచనకిదియె ప్రాథమిక ప్రయత్నమగుట "ప్రమాదో ధీమతామపి" యనుటంబట్టి యజ్ఞాతంబులును

# శ్రీకృష్ణస్తోత్రము



ఇది

నెల్లూరు, వి. ఆర్. ఆర్. హైస్కూలు ప్రధానాంధ్రోపాధ్యాయులగు

శ్రీ మత్ప్రతివాదిభయంకర వేంకటాచార్యుల వారిచే

రచియింపఁబడి,

విస్సన్నపేట అంశ సుండేపల్లి గొట్టిపల్లి జమీందార్ల

మ. రా. రా. శ్రీ. మోతే వెంకన్న, గంగరాజుగార్ల

ద్రవ్యసహాయమున

నెల్లూరు, రామా ముద్రాక్షరశాల యందు

ముద్రింపఁబడెను



ప్రథమముద్రణము 500 ప్రతులు.

1919

ప్రమాదజంబులునగు దోషంబులుండినను క్షవచ్చు. అయ్యావి మన్నించి సదయతఁ దెలిపినఁ బునర్ముద్రణంబున సవరించు కొనువాఁడ.

పోషకులకు నాశీర్వాదము.

క. రాజాననయగు సిరితో
రాజిలుహరి గాచుఁగాత రభసమునసదా
రాజుల మోతే జలనిధి
రాజుల వెంకన్న గంగరాజులఁగరుణన్.

ఇట్లు విన్నవించు
సకలసుజన విధేయుఁడు,
శ్రీ. ప్ర. సోం.
గ్రంథకర్త.

# ప్రకటన.

త్వరపడుఁడు ! త్వరపడుఁడు ! !

సి. యమ్. యస్. హైస్కూలు సీనియరుపండితులగు శ్రీమత్త్రిపతివాది భయంకరం వేంకటాచార్యులవారిచే వ్రాయఁబడిన వైదర్భీపరిణయమను నేడంకముల నాటకమచ్చుగుచున్నది. కొద్ది ప్రతులుమాత్రమే వేయఁబడును. భావసరసము. పద్యములు సొంపుగను రసవంతముగనునుండును. ఇందలి కథ రుక్మిణీకళ్యాణము. కథాంశమెల్లరెఱిఁగినదే యగుట వ్రాయనైతి. ఆలస్యముచేసిన దొరకనేరవు. వలయువారలు గ్రంథకర్తగారి పేరగాని లేక యీక్రింది నావిలాసమునకుఁగాని వ్రాసి కొనిన పొందఁగలరు.

వెల రు 0—10—0.

ఇతరఖర్చులు కొనువారేభరించవలెను.

ఇట్లు,

ఆచంట గోపాలకృష్ణయ్య.

పవరుపేట:-ఏలూరు, కృష్ణాజిల్లా

శ్రీ హయవదన పరబ్రహ్మణే నమః

# శ్రీ కృష్ణ స్తోత్రము.

## ఇష్టదేవతా ప్రార్థనము

ఉ. శ్రీవసుధాదిభూతములు
పృథ్వీరుహాంబులుగోత్రసంఘముల్
దేవదివౌకసారి తతిదీక్షులు
భూజలచార సంహతుల్
పావకచంద్రసూర్యులుఁ దపంబులు
రాత్రిఁబవల్ ద్విసంధ్యలుఁ
సావియు యత్స్వరూపములౌ
సంస్తుతి సేయుదు నట్టి కృష్ణునిన్.

## విఘ్నేశ్వర ప్రార్థనము.

ధృవకోకిల.

శుభచరిత్రుని శుక్లవర్ణుని శుభ్రవస్త్రవిరాజితున్
విభవముప్పఁగ విఘ్ననాయక వేత్రహస్తుఁ జతుర్భుజున్
సుభగరూపు నుతింతు విఘ్నుని జూడవిఘ్నము లేగఁగా
నభయమిచ్చుచుఁ గాపుఁగాతదయార్ద్రమానసుఁ డెల్లెడన్.

మాతా పితృ ప్రార్థనము.

శా. శ్రీమద్వాది భయంకరాన్వయసుధాసింధ్వోమధీశుండు వే
దామోదంపురసాల యిక్కయగు వేదాన్తాభిధానున్సుశీ
లాముక్తంపు గుణాలప్రోకయగు సీతాంబా బలీచ్ఛానుగన్
నీమంబొప్ప భజింతు మత్పితరుల న్నిత్యంబు సద్భక్తిమై.

హయగ్రీవస్తుతి.

క. జ్ఞానానందమయున్విమ
లానుపమస్ఫటిక దేహునవ్యయు దేవున్
మానితువిద్యా ధారుం
బూనిక విద్దెలొసంగ హయముఖు గొల్తుమదిన్.

గురుప్రార్థనము.

మత్తకోకిల.

సరసశాస్త్రవిశార దేంద్రుని సర్వశాస్త్ర ధురంధరున్
విరసపండిత నాగసింహుని వేదతత్వ విచారునిన్
సరసునేతి కులేందుసుబ్బయ శాస్త్రివర్యు దయానిధిన్
గురువరోత్తముశాంతమూర్తిని గూర్మిబ్రోవగ గొల్చెదన్.



# శ్రీకృష్ణస్తోత్రము.



భూనీళాసనవిధు

శోభామృతపాన ముదిత శుంభన్నయనా

నాభీకమలవిధీద్ధితి

శోభితఫణిరాజశయన శోభనమూర్తీ. 1

క. భూసురహృదయాఖేలా

భాసురదానవ పటుబల భంజనరూపా

వాసవముఖ దేవవినుత

భాసితవిమల సుచరిత్రభక్త శరణ్యా. 2

సీ. ఘనమేఘ సన్నిభగాత్రుని బద్మాక్షుఁ

బీతవసనధారుఁ బీనవక్షుఁ

గంబుకంఠు జలదగంభీరనిస్వనుఁ

గౌస్తుభమణిహారుఁ గమలనాథు

వైజయంతీదామ వాసనారాజితు

శంఖచక్రధరుని శార్ఙ్గచాపుఁ,

గామోదకీయుక్తు ఖడ్గనందకరాజు
శ్రీవత్సచిహ్నుని శేషశయను

తే. గీ. దేవదేవుఁ జతుర్బాహుదేవ వంద్యు
సర్వలోకశరణ్యుని సర్వగర్భు
నిఖిలలోకసంచారుని నిర్వికల్పు
సర్వవేద్యుని సదయుని శౌరిఁ దలఁతు. 3

క. వనజాసనాది దేవత
లనిశంబుమదిని విమలతహావణుగ నేరూ
పునరకనాశకమంచును
వినయంబునఁగొల్తురట్టి విష్ణుభజింతుర్. 4

ఉ. నిర్మలమూర్తి సచ్చరితనిర్గుణరూప సురూపపావనా
కర్మవిదూర ఘోరనరకాంతక విశ్వమవిశ్వకారణా
మర్మవినాశనా కలుషమర్దనకాలమ మూలపూరుషా
నిర్మలబుద్ధితోఁ గొలుచునీదగు భక్తునిఁగావు మాధవా. 5

సీ. అబ్జయోని ప్రముఖామరు లతిభక్తి
నినుఁగొల్చియిష్టముల నెట్టియిడరె
యంబరీషుఁడునిను సంజలితో మ్రొక్కఁ
దుర్వాసు గర్వముఁ దూలనడఁచె
ధ్రువుఁడు నిన్నుఁగొలిచి ధ్రువుఁడయ్యెనభమునఁ
బశుపతినీదయఁ బ్రతుకుఁగనఁడె
మున్ను భగీరథుం డెన్నియో ప్రార్థించి
గంగామతల్లినిఁ గాంచలేదె

తే. గీ. మును హరిశ్చంద్రుఁడు గడిపె ముప్పులెల్ల
వఱలె రుక్మాంగదుండును వాసిగాఁగ
నృగుఁడు నిజరూపమును బొందె నీదుదయను
సకలరక్షక పర్వేశ చక్రి కనుము. 6

క. దీనులపాలిటి దైవమ
దీనావన నన్నుఁగావ దిక్కిఁక నీవే
పూనుము మకరవశుఁడనను
హానతిఁగని కరిమనిచెను నజునిభజింతున్. 7

ఉ. దేవతలొక్క చెంతఁ గుసుదీనదశన్విలపించి వేఁడ భూ
దేవులు మానసంబులను దీవ్రతరంబగు దుఃఖమొందఁగా
నీవయదిక్కుమాకని మునీశ్వరు లెంతయు మ్రొక్కు మీనమై
దేవవిరోధిసోమకునిఁ దెచ్చినకృష్ణునిఁ గొల్తునిచ్చలున్. 8

మ. అమరుల్ దానవబాధకోర్వక తదీయాస్త్రాగ్ని కీలాళికిన్
సమిధారూపముతోటఁగాంచి మొదలోసర్వేశ్వరుస్వేఁడఁగా
నమృతంబొందఁగ బోధ నేసి కడు మాన్యత్వంబు దన్జొందఁగా
నమరత్వంబొసఁగూర్చుకూర్మమయు నేనా కృష్ణుఁగొల్తున్మదిన్

చ. దివిజులు మానసంబులను దిక్కిఁక నీవయటంచుఁ గొల్వఁగా
భువినిజనంబు లెల్లరును భోరున గేలులు మోడ్చి యేడ్వఁగా
భువితనభారదుఃఖమును మోముననెల్లవరాహమూర్తియై
యవనినిఁజట్టఁజుట్టు నమరారినిఁ ద్రుంచినకృష్ణుఁ గొల్చెదన్.

సీ. బ్రహ్మాదుఁడనుభక్తుఁ డాహ్లాదమునవిష్ణు
పాదపద్మంబులు భజనసేయఁ

గాంచియాతనితండ్రి క్రౌర్యబుద్ధిహిరణ్య
కశిపుఁడు తనలోన గర్వమెసఁగ
విష్ణుభక్తినిమాన్ప విశ్వప్రయత్నము
సేయఁదొడంగినఁ జిఱుతఁడపుడు
నిన్ను నంజలిఁజేసి విన్నవింపఁగఁగష్ట
చయములెల్ల సరగఁజనవె వేగ

తే. గీ. నెట్టియిడుమలనైనను నెట్టివేసి
తండ్రికోరినబాలుఁడు ధైర్యమూని
వేఁడనరహరిరూపుఁడై వెలసియచట
దైత్యుసమయించు శౌరిసి దలఁతుభక్తి. 11

చ. అలబలిచక్రవర్తి యిలయాగములొక్క శతంబు సేయఁ దా
నలఘుధనంబులన్మణుల నత్యధికంబగు మాన్యభూములన్
సలలితమొప్ప భూసురులు సంతసమొందఁ గనియుగుజ్జవై
యిలనొకకొంతగోరివిభుదేచ్ఛలఁదీర్ప వెకృష్ణ మ్రొక్కెదన్.

చ. పరశువుఁజేతఁబట్టి ధర భార్గవరాముఁడనంగ వీరుఁడై
పరగఁగఁదండ్రియాన గొనిపాపభయంబిసుమంతశూన్యమై
బిరబిరఁదల్లిఁజంపి కృతవీర్యతనూజునిఁద్రుంచి పార్థివా
శిరువదియొక్క మారణఁచియిచ్చ మెలంగవె కృష్ణ మ్రొక్కెదన్

చ. అసురులబాధకోర్వ కమరాధిపుఁడాదిగ దేవసంఘముల్
వెసఁజనినిన్ను వేఁడఁగడు క్రీతినివారలనంపికోసలే
శుసుతుఁడవైజనించి యతిశూరత రాక్షససంఘమున్సమం
జసముగఁద్రుంచిదేవతతిఁజక్కఁగఁజేయవె రామమూర్తివై.

శా. దేవా మా మొఱ యాలకించి కనుమా దిక్కెవ్వ డన్లేదు మా
తావుల్ సక్కఁగఁ జేతఁ బట్టి రసురుల్ దైన్యంబు నొందించి రో
దేవేశా యని వేడ ధాత్రిఁ గరుణాధీరాత్ముఁడై దేవకీ
దేవీగర్భమునం జనించిన మహాతేజున్ సదా గొల్చెదన్. 15

క. పసిబాలుఁ డంచుఁ బూతన
విసపుఁ క్షీరములు గుడుపఁ జెల్లుగ రాఁగా
వెస వెసఁ ద్రావుచు నసురల
నసురాంగద తేర్చి నిల్చు నవ్యయుఁ దలఁతున్. 16

క. శకటము భాతిఁ జెలంగుచు
సకలాధిపుఁ గన్నుఁ గప్పఁ జయ్యన రాఁగాఁ
బక పక నగుచుం దానవు
నుకరంబుగఁ ద్రుంచు నందసూను భజింతున్. 17

క. ఊఁగను బెట్టెడు వేళల
నాఁగుష్ఠము నోటనుంచి యానుటఁ గని తా
నంగడి యశోద ప్రేలిని
నంగుగఁ గొట్టిన నదలెడు నజుని భజింతున్. 18

చ. విపుల కఠోర వక్షమున వేడుకఁ గట్టిన తారహారముల్
గపురపు దండలున్ మెఱయు కాంచనరత్నమయాది భూషలున్
దపనుని మీఱుఁ గాంతి నిడఁ దద్దయుఁ బంగరుటూయెలన్ సదా
యపటుతఁ బ్రీతి నూఁగుట మునాడుచు నూగెడు కృష్ణుఁ గొల్చెదన్

ఉ. పాలను గ్రోల నేర్చుట నపారతృషం దనయుం గ తీకం
జాలివి చేర్పఁ జేత నొక చన్గబళించి తదీయహారమున్

వైళమమాఱుచేఁబడసి పమ్ముగఁ గేరుటఁగాంచి తల్లియో
బాలకయానుమీయనగఁ బాలనుద్రావెదుకృష్ణుఁగొల్చెదన్

క. అనిలుని రూపంబునఁదాఁ
గనుఁగొని పసి బాలుఁడంచు గపటంబున వే
వినువీధిఁ దొద్దగొంచుక
చనెడు నసురుఁబట్టితునుము శౌరిఁదలంతున్. 21

క. బంగరు మువ్వలు కాలిని
నంగారఁగ ఘల్లు ఘల్లుమంచును మ్రోయన్
సంగడి నూచుక ప్రాకుచు
నింగముగొల్పుచుఁ దిరిగెడు కృష్ణుభజింతున్. 22

తే. గీ. చిన్ని మువ్వలు కాలినివన్నె మీఱఁ
జిన్ని నాన్న రా రాయను చిన్నెలరసి
తల్లి దరిసేర నేలను దత్తరముగఁ
గేరిమోఁకాళ్ళఁ దిరిగెడు కృష్ణుఁదలఁతు. 23

చ. తళతళలాడు మేల్పసిఁడి దట్టపుగజ్జెలు నేలతాఁచితే
కలకలలాడు మోములకఁ గందఁగ
బొమ్మములొల్క నేద్వఁగా
నలజడిదీర్పఁ దల్లి వెసనద్దదె
సూడుమటంచు నెత్తి తా
నలరు సువర్ణకారినిడ నాటలఁ
దేరెడు కృష్ణుఁ గొల్చెదన్. 24

ఉ. తల్లినిగాంచి తోరపుఁ బదార్థములెల్ల ససంభ్రమంబునం
ద్రుళ్ళఁగఁ జిమ్మునవ్వుచు పరాకుతయాతయుఁ జూడలక్ష్మై

నుల్లముతల్లడిల్ల వడిమోచన సేయు తెఱంగు దోఁచితా
నుల్లసమొందఁదల్లికడకొయ్యనఁబోయెను కృష్ణుఁ గొల్చెదన్.

తే. గీ. తండ్రిపాన్పునఁ బవళించి తాత యత్త
యుంచుఁ బక్కమ మోమున నందమలరఁ
గొంతతడవునఁ దల్లిఁబోఁ గోర్కి పుట్టఁ
దాఁడి వేఁడెడు శ్రీకృష్ణుఁ దలఁతు భక్తి. 26

ఉ. పాకను బెట్టి తల్లి తగఁ జల్లగ నుండెడు నాఱుబైటనే
నాకు నిఁ జూపఁ గోరు మది నాసలు పొంగఁగఁ దాయిదాయని
శ్లోకము మీఱరా వెయని సన్నలు సేయుటఁ గాంచి వేగమే
గొంకక దాయిదాయి యని కోర్కులు దీర్చు కృష్ణుఁ గొల్చెదన్.

క. అద్దములఁ బోలు చెక్కులు
తద్దయుఁ గదలంగ వేడ్కఁ దాతన నాన్నా
వద్దనిన వినక పలికెడు
నద్దనుజారి నుతియింతు నతులిత భక్తిన్. 28

ఉ. చిన్ని కుమార రార కడుశీఘ్రము మనీదగు ముద్దుసీయుమా
వెన్న నుగ్రోల రమ్మనుచు వేడుకఁ బిల్చినఁ బిడ్డ రామిఁదాఁ
గన్నులు మూసికొంచు వడి గానిట కెవ్వఁడు వచ్చునో యనన్
గన్నులమూఁతవిడువడ గంతముఁజూపెడు కృష్ణుఁ గొల్చెదన్.

క. పడుచును లేచుచుఁ బరుగునఁ
దడఁబడు నడుగులను నడుచుఁ దత్తరమొప్పన్
విడివడిఁ దిరుగఁగ లేకను
వడివడిఁ జేయూఁతనడుచు వరుని భజింతున్. 30

తే. గీ. తల్లికోపమునూపినఁ దండ్రిఁ జేరి
తండ్రిఁ గసరుచుఁబలికినఁ దల్లిఁ జేరి
తల్లిదండ్రులు విసిగినఁ దగ్గియుండి
వెలవెలనడిచిదరిఁ జేరు వెన్నుఁదలఁతు. 31

ఉ. నందుఁడుదన్నుఁజూచి వడినందనరమ్మనిపిల్వ నాసతో
నందకపాణియుండి తగనందున వెన్కకుఁజూచిచూచియా
నందమువిూఱఁదద్దఱమునందునెఱుగ్గొని వేడ్కఁదండ్రియున్
సందిటఁబట్టఁబ్రీతిమెయి సంతసమొందెడు శౌరిఁగొల్చెదన్.

ఆ. వె. బువ్వగుడుచువేళ మురిపెంబుసూపుచుఁ
గూడుదినకమిగిలి గొడఁగుచుండి
కోపగింపఁదల్లి గొంతెత్తియేడ్చుచుఁ
గోర్కెఁదీర్పఁ మెసఁగు గోపుఁదలఁతు. 33

ఉ. పిచ్చికగూండ్లుగట్టి నడివీధులనొప్పఁగ బొమ్మరిండ్లుగాఁ
బచ్చనియాకులుంచియటఁ బాత్రలఁబోలఁగమట్టియుండలన్
బచ్చడికూరపప్పులివె పాయసముల్ మణిపిండివంటలున్
మచ్చికఁదీరఁగుద్వనిడి మర్త్యతనాడెను కృష్ణుఁగొల్చెదన్.

ఉ. వెన్నయుఁబాలుపెర్గులను వ్రేలెఱుమల్లనుగుండలూడ్చి సి
వెన్నఁదుఁద్రావుచుంటఁగని వ్రేతలువీథులఁబ్రువ్వఁదిట్టఁగా
విన్ననిమోముతోఁజనక వేగమనవ్వుటఁగాంచితల్లి తా
యన్నయిదేమికార్యమన నంతనఁజూపవె విశ్వరూపమున్.

ఉ. వెన్నసుదొంగిలించెనట పిడసిగోపకులాంగనాళిన్
గన్నయశోదకున్దెలుపఁగట్టడిసేయఁగ నెంచిరోటికిం

చిన్నతనంపుఁ జేష్టలిఁకఁ జెచ్చెరమానుమటంచుఁగట్టఁగా
మన్ననలందఁగోరియులమద్దులఁద్రుంచెడి కృష్ణుఁగొల్చెదన్.

క. వత్సలఁగాచుచుఁదనరఁగ
మాత్సర్యంబునఁదనదరి మసలుచు వేడ్కన్
గుత్సితుఁడై దాఁగొనియెడు
వత్సాసురుఁజంపియలరు పరునిభజింతున్. 37

క. బకరూపుఁడగు దైత్యుఁడు
వికృతాకృతినోరు దెఱచి విసరుచు నెఱకల్
నికటంబు సేరుతఱిఁగని
వికలాంగునిఁ జేసి చంపు వెన్నుభజింతున్. 38

తే. గీ గొల్లకుఱ్ఱల సరసను గూర్మి నెఱయఁ
జల్దులాఱగించుచుఁ దనచవులఁ దెల్పి
యూరుఁగాయలుఁ బచ్చళ్లునుల్లసమునఁ
జాఱపప్పును సాపడుశౌరిఁదలఁతు. 39

తే. గీ. ధరవఱలు న ఘాసురుఁ డజగరపురూపు
దనర మధ్యమార్గంబునఁ దనదునోరు
దెఱచియుండి సఖులమ్రింగఁ దెగఁగఁ జేసి
సంగడీంద్రఁగాచి నగుచుచక్రిఁదలఁతు. 40

క. వత్సలుఁ బాలురుఁ దానై
వత్సాధిపుఁడు నయితనరి పంకజజాతున్
మత్సరవిహీనుఁ జేసుక
వత్సలతఁ జెలంగఁజేయు పరునిభజింతున్. 41

చ. చదలఁజరించు పక్షిగము
చయ్యనఁ బోవుచు వీచుగాలిచే
వదలశరీరపాటవము
వారినిమున్గుచు గ్రుగ్గుచుండఁ దా
నెదఁదలపోసి జీవతతి
యిక్కటులం బెడఁ బాపఁ గాలియుం
బదమునుమార్పనిచ్చమయి
మార్గ్గానఁబోయెను కృష్ణుఁ గొల్చెదన్. 42

క. కాళియుకొలని గంతిడి
కాళినిమర్దనముసలిపి కాంతలు వేఁడన్
బాలించివిడిచి సదయతఁ
జాలెడుసంస్తుతులనందు శౌరిభజింతున్. 43

క. గోపులగోగోపికలను
నాపదపాల్సేయు నగ్గి యంతటఁ జుట్టన్
గోపులనందుచు నిడుమలఁ
బాపఁగఁ గార్చిచ్చు మెసఁగుపరుని భజింతున్. 44

మ. జలకేళిన్విహారించు నిచ్చవ్రెడమన్ సారోదకాస్థానముం
జలజాకీర్ణముహంసయుగాధయుత కాసారంబుఁ దాఁ గాంచి గో
పలతాంగ్యాళిదుకూల సంచయము శుభ్రంపుందరిం బెట్టి వే
జలముం జేరుదుబట్ట లెత్తి చనువా చక్రాయుధుం గొల్చెదన్.

ఉ. నింగి మొయిళ్లమధ్యమున నిక్కుచుఁ జుక్కలు వెల్గురీతిని
ప్పంగలనిల్చి [illegible] నీలదేహముం

బంగరుమువ్వలందముగ భాసిలుచుండఁగ గోపికాళి ను
ప్పొంగుచు మోసగించుతతిభీరుమహామెక్కి నకృష్ణుఁ గొల్చెదన్.

క. బృందావనమున ఋష్యర
విందాననలమదినిఁగని విందుభుజింపం
బొందుగ నెమ్మదిఁదగనా
నందంబున వఱలు నందనందనుఁ గొల్తున్ 47

ఉ. గోపికలెందఱో కొలువ గోగణమెక్కుడు బాధనొందఁగా
గోపజనంబులెల్ల గుమిగూడి యశక్తత మొఱ్ఱవెట్టఁగా
నాపదఁబాపఁ గోర్ధరము నత్యధికంపు సుశక్తి నెత్తి యా
గోపుల నాలదూడలను గోముననాచిన కృష్ణుఁ గొల్చెదన్.

క. నందుని వరుణభటులఁగ సా
నందంబుగ నిజనగరిని నాయనికిఁయుఁ
నందనుఁడై పరగుచు ద
న్నందఱుఁ గొనియాడఁ బెచ్చు నచ్యుతుఁ దలఁతున్. 49

సీ. ఒకలేమ విడదానొప్పఁగఁ జేఁబట్టి
సరసంపుగీతలు సరవిఁ బాడ
నొకచాన వెనువెంట వికసించు మోమునఁ గోఁ
బదములు దట్టుచుఁ బరగఁ దొడర
నొకరామ కరముల నొయ్యనఁ గదుపుచు
హస్తముల్ నూపుచు హాసమొంద
నొకభామ నృత్యంబు నొయ్యారమొలుకంగ
సలుపుచుఁ బయ్యెదఁ జక్కఁ బరుప

తే. గీ. నొకతెయులయుచు వెనుదీయ నొకతెపాడ
వనితలెందఱో గుమిగూడి వఱలుచుండ
మగువలలయ రాసక్రీడ మఱపుఁగొలిపి
సంభ్రమంబునఁ జరియించు శౌరిఁదలఁతు. 50

సీ. వలువలందఱునూడ్చి పరుసగాఁదటమున
వరుసలుదీరఁగ సరగఁబెట్టి
కచములు పైఁజుట్టి కుచములుబిగఁగట్టి
జలములు సేయుచుఁ జలమువిరాజ
జలజాక్షి యొకరిత జలములఁదోయించి
మోమునఁజల్లుచు మోదమంద
దానినవ్వలఁద్రోసి తరళాక్షి యొక్కర్తు
తద్దయుఁజల్లుచుఁ దనివిదీర
ఆ. వె. వాలుఁగంటియొకత వాలుగఁ దాఁజూచి
భీతినఱచి గొంతు బిగువఁజుట్ట
నీటిలోనఁ దాఁకరిత నెత్తిపైఁజల్లెడు
జలజముఖులవఱలు శౌరిఁదలఁతు. 51

సీ. కరకంకణంబులు ఘల్లుఘల్లనుచుండఁ
గాలిగజ్జెలొరసి కరము మ్రోయ
విపులవక్షస్థిత వివిధహారంబులు
వెసవెస వీపుల వింతసేయ
మొలనున్న గజ్జెలు మురిపెంపు ధ్వనులీనఁ
దలనుండు కుళ్లాయి తళుకులలరఁ

దనువున నంగీలు దద్దయుమెఱయంగ
సిగముడివీడుచు సిరులుసెలఁగ

తే. గీ. జుట్టునముడిచిన విరులుచుట్టురాల
మోమునఁ జిఱుచెమ్మట లొప్పిముద్దులొలుక
గంతులేయుచు బాలుర బంతులాడు
చిన్నికృష్ణుఁ భజియింతుఁ జింతదీర. 52

క. అతుల బలాఢ్యముభుజగం
బతిశక్తిని నందుఁబట్టి నాఁకటగోవుల్
మతులు సెదరి భీతినఱవ
నుతిసేయఁగ జనకునివెత నుఱుమవె కృష్ణా. 53

తే. గీ. పండువెన్నెల గోపికల్ పిండికొలువ
వేణుగానంబుసేయుచు వేడ్కమిగుల
సకియలందఱఁ గొంపోవుశంఖచూడుఁ
జమరి పొలఁతులఁ గాచెడి శౌరిఁదలఁతు. 54

క. ఖురములఁ బుడిమిసిదువ్వుచు
ఖరశృంగములెత్తి వడిగఁ గడకొనిఘోరం
గరముగనార్చు వృషాసురు
నరలోకముఁ బాయఁజేయు నరసఖుఁగొల్తున్. 55

క. ఘోషవ్రజమెల్ల మహా
ఘోషములుం బెదరనరిగి ఘోటకుఁడు వెసన్
భీషణముగఁ బోరఁదోడర
ఘోషులలరఁ గేశిఁ దునుము గోపుఁదలంతున్. 56

క. నభమును భూమియుఁ జెదరఁగ
సభయంబుగ గోపవర్గము చయ్యనఁ బాఱన్
విభుఁడై ఘోరు నఘాసురు
నిభమును హరిక్రియఁ జిదిమిన కృష్ణు భజింతున్. 57

తే. గీ. కువలయము చెదరనడచి గుజ్జు మెఱయఁ
గెలఁకులదరంగ ఘీంకృతి సెలఁగఁజేసి
కువలయాపీడము గడఁగి క్రుమ్మఁ దొడర
జనులు నుతియింపఁ గడతేర్చు శౌరిఁ దలఁతు. 58

తే. గీ. మల్లవిద్దెలు నేర్చిన మాకుసాటి
ధాత్రి నెవ్వారు లేరని ధైర్యమూని
చెలఁగు చాణూర ముష్టికుల్ ఘోరమతుల
నన్నుఁగూలఁగ సమయించు నజు భజింతు. 59

సీ. పూతన బాఁబోయి పొలిసెను గటకటా
శకటాసురుం డేగి జమునిఁ జేరెఁ
గడఁగి తృణావర్తుఁ డడఁగెను ధృతిఁ గోన
ధేనుకుండును జనియెఁ జీనుఁగ ద్యో
వత్సాసురుండటఁ బాసెను బ్రాణముల్
బకుఁడును మనుసుతులఁ బాపికొనియె
వ్యోమకేశులు వసి నూపిరుల్ విడిచిరి
యమునమడుగున మేనువదలి విడిచె

తే. గీ. మల్లులుదరి కేఁగి మసలి మాయమైరి
నేనెకడ తేర్తు నీ ప్రీతి నెమ్మిఁగూడ

దంచుఁదలఁబోసికరవాల మరయుచుండ
వేగనొడిసి కంసుఁడును వెన్నుఁ దలఁతు. 60

ఆ. వె. కంసుఁజంపి యెలమిఁ గాఁ జెఱలోఁ దెడి
తల్లిదండ్రులకడఁ దనయుఁడౌచుఁ
గట్టుఁద్రాళ్లు విప్పికడు సుఖమొందరా
జ్యంబుతాతకిచ్చు శౌరిఁదలఁతు. 61

సీ. గర్గాదిభూసుర కింకరవులుతగ
వేదమంత్రవిధిని ద్విజులఁ జేయఁ
దండ్రియానతిఁగొని తనరారుపేర్మి న
వంతినిసకలవిద్వద్వరుఁడగు
సాందీపునొద్దన సంభ్రమంబొప్పఁగ
సర్వవిద్యలునేర్చి సవినయముగ
దక్షిణసీయఁగఁ దాగురుసన్నిధిఁ
బూజించియడుగుడుఁ బుత్రుఁగోర

తే. గీ. గురునికోరికదీర్పంగ సరభసముగఁ
బంచజన్ముదుంచి శంఖమువడసి వెనుక
శమనుఁడడలుచు బాలుని సరగనీయ
గురునకర్పించిధన్యుఁడౌ గోపుఁదలఁతు. 62

ఉ. బంధువులెల్లరోక్ష్మసికి
భామినిఁజేయఁగౌవాచరుక్మిణి
గొందలమందియా వెనుక
కోరుచుఁదెల్పుచు [illegible]ంపని

ర్మందరతంజరించియల
మానినీశత్రులుమూఁడఁదేరిపైఁ
గండువలాడఁగాఁదొడఁగి
కాంతగఁజేకొను కృష్ణుఁగొల్చెదన్. 63

సీ. నాదుతమ్మునడవి నందసూనుఁడు ద్రుంచి
మణిఁగొంచుఁబోవుట మమతఁగాదె
ఏఁక నెదిరిపోరవీరుఁడందురుగాని
దొంగపగిదిఁజాపద్రోహియనక
యంచుఁబలుకు ప్రసేనాగ్రజవాక్యంబు
విన్నతోడుతమది వెగడునొంది
లోకులుకాకులు లోకాపవాదంబుఁ
బాపఁదగునుగాని పడయఁదగద

తే. గీ. టంచుదలఁచి సత్త్వరముగ నడవిసొచ్చి
కాంచితథ్యము సారబారిగహ్వరమున
జాంబవంతుఁగెల్చియలగు జాంబవతిని
మణినిఁగొనితెచ్చి చాటిన మహిమఁదలఁతు. 64

చ. తనయపరాధసంచయము దవ్వదొలంగఁబ్రసేనుభ్రాతదాఁ
గనినిజకన్యకామణులఁ గాన్కగఁదీసుక భీతచిత్తుఁడై
వినయముపెంపుతోసభను వెన్నుఁడనిగ్గని వేఁడఁ బ్రీతిపైఁ
గినుకనుబాపిసత్యఁగొని కేరుచువానికిరత్నమీయవే. 65

సీ. కాళిందినిన్ను నే కామించియున్నాని
గోరనిల్చినఁ గూర్మిపలికి

విందానువిందులు విమతులై పరుగిడ
మిత్రవిందనుగొని మెప్పునొంది
నాగ్నజిత్తినిఁగొని నాగబలంబున
గోవృషంబులఁద్రుంచి గోముమీఱ
శ్రుతకీర్తిపుత్రిక శుభగుణరాజిత
భద్రను జేపట్టి వాసికెక్కి
తే. గీ. శత్రుమదగజహరియయి సంచరించి
సర్వలక్షణలక్షణసరసఁ జేర్చి
శూరతతను జేరవఱలి శుభదినముల
నందఱఁబరిణయంబగు నజునిఁదలఁతు. 66

మ. సురరాజుండనుమాడ నెమ్మనముతో శూరత్వ మొప్పారఁగా
నరకుండేఁగుటఁజూచి యోనరసఖా సన్నావ వేయుంచు వేఁ
డరయంబొప్పఁగ సత్యతోఁజని నిశాటాకేసరుంజంపి యా
పురుహూతుంగను కాచినట్టి సదయున్ మూలున్నదా
కొల్చెదన్. 67

క. సురనాథుఁడడలఁ దోడరఁగ
సరభసగతి వ్రాయి పారిజాతముఁగొని వే
సరసత సాత్రాజితికిడి
పరువపుఁగౌఁగిలిఁగొను మోడివరదు భజింతున్. 68

క. బృందావనాంతరంబున
విందుగుడిచియుటఁదనయరవిందముఖులనా
నందాబ్ధిముంపఁగడకొని
యందందవిరులసరసెడు నచ్యుతుఁదలఁతున్. 69

సీ. రుక్మంపుఁగాంతినిరూపించుపూవుల
రుక్మిణికిచ్చుచుతోసముదుపు.
లక్ష్మణంపువిరుల లాలసంబునఁదెచ్చి
లక్షణకిచ్చుచులావుమెఱపు
సరసంపుసుమములసంభ్రమంబునఁగొని
సత్యకొసంగుచుసరసమూడు
మాధవీకుసుమంబుమచ్చికఁగొని తెచ్చి
మిత్రవిందకొసంగి మేనునిమురు.

తే॥ గీ. కనకములనిడికాళిందిఁగాఁగిలించు
నిట్లుకాంతలనందఱి కిచ్చిఁగొలుచు
బుష్పములనిచ్చివరుసనుతుదమొనర్చి
సంతసించెడికృష్ణునిసన్నుతింతు. 70

సీ. రుక్మిణియొక చెంత రుక్మంపుఁబూవుల
సురఁటిసేతనుబట్టి సరవివీవ
సత్యభామసరస సంతసంబున నిల్చి
గందముమేన నలందుచుండ
లక్షణయొక ప్రాంతలాలితంబుగ నిల్చి
వలయాదిభూషలు వరుసఁదొడుగ
మిత్రవిందవిరులు మేలుగముడువంగఁ
గాళిందియడుగులు గడుగుచుండ

తే. గీ. నాగ్నజిత్తిప్రీతిఁ గురులు సవరించుచుండ
జాంబవతితిలకంబును [illegible]

భద్రవీడెంపు మడుపులు భద్రపరుప
భద్రపీఠుఁడౌ కృష్ణునిభజనసేతు. 71

సీ. రతనాలగోడలరాజిల్లు భవనము
భవనకుడ్యంబులఁ బటములలరుఁ
బటముల నందందవటిలు భూజంబులు
భువిజంబులనలరుఁ బులుఁగుపిండు
పులుఁగుపిండులునోళ్ళఁ బూరించుఫలములు
ఫలములుదిగఁ జాతిపడునునేలఁ
బడుపండ్ల నెత్తుక బాలురు తినుచుంద్రు
తినుచుంటఁగోఁతులు దిరుగఁజూపు

తే. గీ. కోఁతులంగని బాలురుగోలఁగొట్టు
నందమొప్పెడు నద్దాలనలరుచుండి
పట్టుపరుపులనొప్పెడు పడకటిండ్ల
గోపికాళిని విహరించు గోపుఁదలఁతు. 72

సీ. స్ఫటికంపుగోడల భాసిల్లునిలువుట
ద్దాలపైఁదనరు రత్నాలచయము
రత్నాలకాంతులరాజిల్లుహంసలు
చక్రాంగములఁబోలు సారసములు
సారసంబులలరు సారసచ్ఛాయల
ఛాయలనొప్పారు సారజలము
జలతరంగంబుల జలజాతహితులుంద్రు
సంగడిమొలఁగెడుజలచరములు

తే. గీ. సరసులదరిని గేరులుదాఁటుచుండు
నట్లలరెమచిత్తవృత్తులయందమెసఁగు
పడకటింట్లనురక్తిమైభాజనముగ
గోపికాళినివిహరించు గోపుఁదలఁతు. 73

సీ. రతనంపుదీపాలరహిమించుగోడలు
గోడలనంటుచు కుందసరులు
సరులతోనలరారుసరసంపుఁబటములు
పటములభాసిల్లుభటచయంబు
భటులతోరాజిల్లుఁ బాలకబృందంబు
పాలకాళినలరుఁ బాలవిరులు
పాలవిరులనొప్పుభక్తగణంబులు
భక్తులదీపించుముక్తివిధము
తే. గీ. ముక్తిపథము తేజరిలునుమునిచయమున
మునులదేహంబులొప్పునుముదిమిదెలియ
నిట్లుదీపించుకేళికయిండ్లలోన
గోపికాళిసక్రీడించు గోపుఁదలఁతు. 74

సీ. బంగారుసరిగలవలువలు మేల్కట్టులు
మేల్కట్టులలరునుజల్కుగములఁ
జిలుకలుభజియించుఁజిప్పురుజొంపంబులు
చిగురులనొప్పును జిలుగువిరులు
విరులనునందందవిలసిల్లుమధువ్రతంబు
మధువ్రతనాదనిమధుపచయము

మధురంబులెగయుచు మందలై పరఁగును
బరుగిడు వేళలఁ బత్తులెగయఁ

తే. గీ. బత్తులెగయుటఁ గాంచుచుఁ బక్షిహరులు
చేతనురులను నేసెంచు చిన్నెలుంచు
నంద మొప్పారు కేళిగృహాంతరముల
గోపికాఁ గ్రీడించు గోపుఁ దలఁతు. 75

ఉ. గందములందిమేనవర కామినులంగుగఁ జుట్టికొల్వఁగా
నందమెలర్పఁ గేళిభవనాంతరసీమను సిల్పి సత్యనుం
గొందలమందఁ జేసి యొకకొంతపిఱుందను గేళిపృదాఁటనా
నందముగల్గఁ జేసి పడినారుగ ముద్దుకృష్ణుఁ గొల్చెదన్. 76

మ. అలనాకంబున దేవతాలి నలుకన్ హాహాయనం దోలిభూ
జలతాకుంజనగాదులం బరపి రాజారణ్యదావాగ్నియై
కలనంజిక్కిన రాజులన్ దునుముచుం గాతాలి బాధించుచున్
దులువౌ బాణునిగర్వమేర్పెయిలపైఁ దూలింప వేధూర్జటిన్.

క. బలగర్వంబున నంధత
వలయుమ్మగ నలమికొంటఁ బౌండ్రకుఁడు వెసన్
గలహప్రియుఁడై గడుకొని
కలనం గదిసినఁ దునుము బకరిపు భజింతున్. 78

మ. సరవిన్ రాజులఁ బట్టిచంపుచు జరాసంధుండు దా రాజ్యమున్
వరకుల్ వెట్టుచు రాజకాంతల వడిం బాధించుచున్ దుష్టుఁడై
పరవన్ భీమద వానలంబు గొనియా పాకారిసూనుండు దా
సరగన్ వాయుసుతుగాఁగఁ గొల్చి వెజరాసంధుఁ బొలిపించు కృష్ణుఁడా.

ఉ. భూపతిసంఘముల్ విమలపుణ్యాత్ముల్ మునిసింహులుం సభం
బాపహరుండు కృష్ణుఁడె సమర్చనకుం దగునంచుఁ బల్కనో
భూపయమాత్మజా యిచటఁ బూజల నందఁగఁ గృష్ణుఁ డొప్పెడం
చోపక పేలు చైద్యునట నొద్దిక మార్చినకృష్ణుఁ గొల్చెదన్.

క. వైదర్భి పరిణయమ్మునఁ
దాఁ దలపడి యోడి పిఱుఁదఁ దపమున హరుచే
మాదిరి లేనివరముఁ గొని
చీఁదఱిఁగొని యెదురు సాళ్వుఁ జెండవె కృష్ణా. 81

ఆ. వె. దంతవక్త్రుఁ జంపితగఁ గ్రూర రాజులం
బీచ మడఁచి మిగిలి పేరునొంది
రాజనీతిఁ బరపి రాజులఁ బాలించు
కృష్ణుఁ దలఁతు నెల్ల తృషలు దీర. 82

క. ధరపై సఖుఁడు కుచేలుఁడు
గురుతర దారిద్ర్యజలధిఁ గొట్టాడుచు నీ
చరణజలజములఁ గాంచఁగ
మురహర పోషింప లేదె మోదంబలరన్. 83

క. జనులు ముదంబునఁ జేసెడు
వినుతులు సెవులార వినుటఁ బెంపగు హర్షం
బునఁ గంసవిహాతుల నుతులఁ
గన వేదజననిఁ దనుపు బకరిపుఁ దలంతున్. 84

క. తనసుతులు పుడమిఁ బుట్టియు
మెరు వెంట నమడియుచుండఁ జెల్లగు పెతతోఁ

జనిదురపిలుభూసురునకుఁ
దనయులనొసఁగితని పెనుగదాధరుఁదలఁతున్. 85

ఉ. పాండవమధ్యముంగడు నపారబలున్విమలాంతరంగునీ
యుండను జేసి మెల్లెడల నత్యధికంబుయశంబుగల్గునా
ఖండలునాజిఁ గెల్చియుల ఖాండవకానన మేర్చు పావకుం
బాండుసుతుండుగా చెవను మన్ననిల్చిన కృష్ణుఁ గొల్చెదన్.

శా. నానారాజసభన్సుయోధనుఁడుదా నారీమణిం గృష్ణనో
సీనం జేరవెయన్న దుర్మతినిదు శ్శీలుండు దుశ్శాసనుం
డేనాఁ డీన్వడిఁబట్టఁ జేలమునన న్నీశాదయాసింధువా
మానంబిమ్యోడఁగావవేయనుడు సమ్మానంబునంబ్రోవవే.

చ. మొదటనుబంధునై తనరి ముఖ్యుని జేసుక బంధుకోటిలోఁ
బిదపనుబద్ధసఖ్యమున వృద్ధికిఁ దెచ్చితి సంతసంబుమైఁ
ముదకిలబావఁ జేసితగఁ దోలిపి తేరు ససంభ్రమంబుగన్
వదలక పార్థుగాచుగతి పైళమరోముమకృష్ణ మ్రొక్కెదన్.

ఉ. రాజసంభ్రాంతరాళమునరంజిలఁగృష్ణుఁడ రాయబారివై
జేజమెలర్పధర్మజుని ధీరతదెల్పు కురుల్కు వల్కఁగా
రాజసమొప్పనీకు నపరాధము సేయఁదలంపనంధుఁడా
రాజనకట్టులిచ్చియులరారఁగఁజూప వివిశ్వరూపమున్. 89

ఉ. సారథివై కిరీటికటఁ జక్కఁగఁ దేరునుదోలుచున్మహా
పారరణావనిన్నరగ భక్తసమూహముసంతరింపఁగా
సారపదార్థతత్త్వరస సంగ్రహమొప్పఁగఁ జెప్పితీవ్రసం
సారవిచారహారియుల సారసుగీతనుగృష్ణగావుమా. 90

ఉ. ధర్మములన్ని యున్నడపి తద్దయుఁ గొల్చుచు నిన్ను నొక్కనే
నిర్మలబుద్ధితో మసలు నీదగు భక్తులఁ బ్రోతునంచు నీ
నిర్మలగీతలస్మృతుల నిశ్చయ మొప్పఁగఁ దెల్పినట్టి నీ
ధర్మము వీడకిచ్చ మెయి ధన్యుని జేయుము కృష్ణ మొక్కెదన్.

ఉ. పాయక కంటితెప్పవలెఁ బార్థుఁడు గాచు మునాగయోత్తమున్
బాయఁగఁ జేతునంచలిగి ప్రాణములా ద్వితయంబు మేనులన్
రాయిడి వెట్టనెంచియట రంజిలనాలము సేసి ముందటన్
గాయువు మొపు సేసి వడిఁ గాచిన కృష్ణుస భక్తిఁ గొల్చెదన్. 92

ఉ. సందడి లేక యెల్లపుడు సంభ్రమ మొప్పఁగఁ గోపికాళి నం
దందును బోరనీకయిల నన్యుల దండ్యుల శిక్ష సేయుచుం
గందెలక్రాలెదా సతతిఁ గన్నుల నద్దుక ప్రీతిఁ జేసియాం
దిందన కెల్లతావులని జేచ్చను గాచెడి కృష్ణుఁ గొల్చెదన్. 93

చ. జయవిజయాఖ్యభక్తులట సాయుధపాణులు నిన్ను భక్తిమై
జయజయయంచనంతగుణ సారసుధారసపానులై సదా
నయమున గొల్చునత్తఱిని నన్యపు శాపమునందు నున్మహా
భయదనిశాటరూపులగు భగ్నులముమ్మరు దీర్చి ప్రోవవే. 94

శా. దేవేంద్రాదిసురల్ మహాభయముచేఁ దేజంబు లోల్ప్రయితా
రా వైరిత్యాధికంపు భాటివశులై హాహాగతిస్వేదసం
భావింపంగన పూర్వమా నిలఁ దరూపానన్ని శాటాధముల్
భావంబందుమునుంగ నాకులసుధాపానార్థులం జేయవే. 95

ఉ. వేణునినాదమున్వినెదు వేడుక వేల్పులు పాములాటునా
దీనెలు పారవైవల విద్దెలతల్లి మొగంటుదయ్యాగా

ధేనువులఙ్జులెత్త వినుతింపఁగ గోపకులంబు పాడు నా
గానవిలోలుఁ గృష్ణు నధికంపు సుభక్తిఁ గొల్తు నిచ్చలున్. 96

ఉ. తాపసబృందముల్ భువి సితాంతము నిర్గుణమూర్తి వంచునీ
రూపము నిల్పి కాదె మదిఁ గూరిరపుఁ బాపము నొందనీయరే
పాపముఁ జెంతరాక శరభంగమునీంద్రుఁడు ముక్తిఁ బొందఁడే
పాపముఁ బాపు మ్రొక్కెదను వాసవసోదర గోపపాలకా.97

చ. త్రిపురులఁ జంపితా ధరణి దేవుల బాధల మాన్పెంచియా
విపులజటాధరుండు కడు నీకును బోరుచుఁ జంపుచుండఁగా
శ్యపివడినినుచుఁ జెనన జచ్చిన దైత్యులు లేచి పోరఁగా
నపరుడసేవగాదె విజయంబొనగూర్చితి కృష్ణ మ్రొక్కెదన్ .

మ. సమరక్షోణిని సంచరించి యిలరా జానీకగర్వంబు మా
న్పిమదేభంబుల సాకురీతి వడిభూ పేంద్రాళికిన్ని తులన్
సమరాంతస్థితమర్మముల్ దెలిపివే శౌర్యంబు మీఱంగ నే
మము రంజిల్లఁగఁ జేసి నిల్వవె హరీ మారాత్మజా మాధవా.99

మ. నరనారాయణ రూపభేదములకో నారాయణుం బోధకున్
నరుశిష్యోత్తముఁ గాఁగఁ జేసి సుకరా నన్యంపు మార్గంబునా
నరుమాలంబునఁ దెల్పి భక్తులను నానాపాపులన్గాచు నా
సరసంపుం గుణరాశిఁ గొల్తు యదువంశాంభోధి శీతాంశునిన్ .

చ. అరమరలేక సీసగి సనంజలినిచ్చినయంబు మీఱు భూ
వరగణ మొప్పసిచెరణ పద్మములంటఁగ నద్దిగాంచి వే
సరసపు మొల్కఁ బెం చిదయఁ జక్కఁగ ధాత్రిని నేలఁ జేయ వే
సరసగుణాఢ్య కృష్ణ రభసంబునఁ గావగదయ్య మ్రొల్లెదన్.101

మ. కలికాలంబిటవచ్చుచుంటఁగమలాకాంతామణీయుక్తుఁడై
యలసృష్టిస్థితినాశకర్తయన శేషాద్రీంద్రవాసుండునై
యలదివ్యాకృతి వేంకటేశుఁడనగా నీలీలఁదానిల్చిభ
క్తులపాపంపుబయోధితారకుముకుందుంభక్తిమైఁగొల్చెదన్.

క. సంసారజలధిదాటఁగఁ
గంసారియెనావయంచుఁ గాంచితిభక్తిన్
ధ్వంసమొనర్పియఘంబులు
సంసారిననుంబ్రియమునఁ జయ్యనఁగనుమా. 103

క. నీవేసఖుఁడవుమంత్రియు
నీవేతలిదండ్రులెపుడు నిజముగనాకున్
నీవేగురుఁడవుబంధువు
నీవేపోషకుండవగుదు నీరజనాభా. 104

ఆ. వె. పక్కిరౌతువగుచుఁబత్తులగతినున్న
భక్తజనులఁగావఁబరుగుదీయు
శపథమూనువాఁడసరభసగతిఁగృష్ణ
గమ్మునన్నుఁగావరయముతోడ. 105

సీ. పలుకులనీనామపఠనంబెమతినాకు
మాఱువిధమెఱుఁగమారజనక
నడకలనీయదు నటనంబెతలఁపోఁత
యన్యమెఱుంగనుసంబుజాక్ష
వనులనునీయదుపరిపాలనానీతి
పాయదునామదిఁబద్మనాభ

నిదురనునీవగునీలమేఘశ్యామ

లాకారమేకంగాసజ్జనక

తే. గీ. సర్వవిధములనిన్ను నే స్మరణసేతుఁ
గాలభేదంబులేక త్రికాలవేది
కొల్చుభక్తునిసదయతఁగోర్కెదీర్ప
రావెశ్రీకృష్ణ ! గోవింద ! రభసగతిని. 106

ఉ. నీమము లేదు నామకడ నిర్మలబుద్ధినిఁగొల్తునన్న నే
నేమియు మంత్రరాజమును నిచ్చను నేర్వను నీదు నామమే
నేమమటంచు నేర్పితిని సిద్ధము సేతులు మోడ్చి మ్రొక్కెదన్
నామది నిల్చి యెల్లపుడు నన్దయఁ గావుమ యాదవోత్తమా.

క. జలదశ్యామలరూపా
విలసన్నవ వారిజదళవిపులతరాక్షా
జలజసఖసోమనయనా
సలిలాకరమధ్య శయనసర్వశరణ్యా. 108

క. కేశవనారాయణగో
పేశా వామనమురారి విష్ణువరేశా
యీశా త్రివిక్రమహృషీ
కేశా మాధవనరహరి కృష్ణభజింతున్. 109

క. దామోదరమధుసూదన
భూమీశాజలజనాభముక్తివరేశా

సామాదిగానలోలా
వేమారుదలఁతు నినునెద వెన్నుఁడకనుమా. 110

తే. గీ. శతమునకుఁ బైని నవతారసంఖ్యదనరఁ
బరమపూరుష నీదయఁ బద్యములు
రచన యొనరించి నీకుదారార్పణము సేయు
ధన్యతనుగంటి శ్రీకృష్ణదనుజవైరి. 111

తే. గీ. విదితమానీదు చరితము విశదముగను
దెలుపనశక్యుఁడు నమకట్టుఁ దెగువఁ జేసి
తెలుపఁదలంచిన శేషుఁడు దెలుపఁగలఁడె
కనదు శేషోక్తి శ్రీకృష్ణదానవారి. 112

మాలిని. వితతసుగుణశోభా విస్తరారాతిసింహా
నతనుతగీతా నాగరాజాంసతల్పా
యుతులశుభచరిత్రా యాత్తభక్తాలిరక్షా
యతిభుజబలతేజా యాదవేంద్రాబ్దివర్యా. 118

## ఫలశ్రుతి.

క. కృష్ణస్తోత్రము సదివినఁ
గృష్ణుఁడు మదినిల్పి విఖిల శ్రీలను సంగున్
దృష్టులు సర్వము దీర్చును
వృష్ణికగిదినఘుచయముల వేగదహించున్.

